# అథ చతుశ్చత్వారింశోऽధ్యాయః

## వ్యాసుని జననము

మునయ ఊచుః |

వ్యాసోత్పత్తిం మహాబుద్ధే బ్రూహి సూత దయానిధే | కృపయా పరయా స్వామిన్ కృతార్థాన్నిష్కురు ప్రభో || 1

వ్యాసస్య జననీ ప్రోక్తా నామ్నా సత్యవతీ శుభా | వివాహితా తు సా దేవీ రాజ్ఞా శంతనునా కిల || 2

తస్యాం జాతో మహాయోగీ కథం వ్యాసః పరాశరాత్ | సందేహోऽత్ర మహాన్ జాతస్తం భవాన్ ఛేత్తుమర్హతి || 3

మునులు ఇట్లు పలికిరి -

ఓ సూతా! నీవు మహాబుద్ధిశాలివి. దయానిధివి. నీవు పరమదయతో వ్యాసుడు పుట్టిన విధానమును చెప్పుము. ఓ స్వామీ ! ప్రభూ! మమ్ములను కృతార్థులను చేయుము (1). సత్యవతియను మంగళ స్వరూపురాలు వ్యాసుని తల్లి అనియు, ఆ దేవి శంతను మహారాజును వివాహమాడినదనియు చెప్పబడినది (2). ఆమె యందు పరాశరుని వలన మహాయోగి యగు వ్యాసుడు జన్మించుట ఎట్లు సంభవము ? ఈ విషయములో మాకు పెద్ద సందేహము గలదు. దానిని నీవు నిర్మూలించదగును (3).

సూత ఉవాచ |

ఏకదా తీర్థయాత్రాయాం వ్రజన్ యోగీ పరాశరః | యదృచ్ఛయా గతో రమ్యం యమునాయాస్తటం శుభమ్ || 4

నిషాదమాహ ధర్మాత్మా కుర్వంతం భోజనం తదా | నయస్వ యమునాపారం జలయానేన మామరమ్ || 5

ఇత్యుక్తో మునినా తేన నిషాదస్స్వసుతాం జగౌ | మత్స్య
గంధామముం బాలే పారం నావా నయ ద్రుతమ్ || 6

తాపసో%యం మహాభాగే దృశ్యంతీ గర్బ సంభవః | తితీర్షురస్తి
మర్ధాబ్ధి శ్చతురామ్నాయపారగః || 7

ఇతి విజ్ఞాపితా పిత్రా మత్స్యగంధా మహామునిమ్ | సంవాహయతి
నౌకాయామాసీనం సూర్యరోచిషమ్ || 8

కాలయోగాన్మహాయోగీ తస్యాం కామాతురో%భవత్ | దృష్ట్వా
యో%ప్సరసాం రూపం న కదాపి విమోహితః || 9

గ్రహీతుకామస్స మునిర్దాశకన్యాం మనోహరామ్ | దక్షిణ న
కరేణైతామస్పృ శద్దక్షిణ కరే || 10

తమువాచ విశాలాక్షీ వచనం స్మితపూర్వకమ్ | కిమిదం క్రియతే కర్మ
వాచంయమ విగర్హితమ్ || 11

వసిష్ఠస్య కులే రమ్యే త్వం జాతో%సి మహామతే |నిషాదజా త్వహం
బ్రహ్మన్ కథం సంగో ఘటేత నౌ || 12

దుర్లభం మానుషం జన్మ బ్రాహ్మణత్వం విశేషతః | తత్రాపి
తాపసత్వం చ దుర్లభం మునిసత్తమ || 13

విద్యయా వపుషా వాచా కులశీలేన చాన్వితః | కామబాణ వశం యాతో
మహదాశ్చర్యమత్రహి || 14

ప్రవృత్తమప్యసత్కర్మ కర్తుమేనం న కో%పి హ | భువి వారయితుం శక్త
శ్శాపభీత్యాస్య యోగినః || 15

సూతుడు ఇట్లు పలికెను -

ఒకప్పుడు పరాశరయోగి తీర్థయాత్రకు వెళ్తూ, అనుకోకుండగా పవిత్రము, సుందరము అగు యమునా తీరమునకు వెళ్లెను (4). అపుడు ఆ ధర్మాత్ముడు భోజనమును చేయుచున్న పల్లె వానితో,'నన్ను శీఘ్రముగా యమునయొక్క ఆవలి తీరమునకు చేర్చుము'అని పలికెను (5). ఆ మహర్షి ఇట్లు పలుకగా, పల్లెవాడు తన కుమార్తెయగు మత్స్యగంధతో, 'అమ్మాయీ! ఈయనను వెంటనే నావపై ఆవలి ఒడ్డునకు చేర్చుము. ఓ పుణ్యాత్మురాలా ! దృశ్యంతి అను ఆమె యొక్క పుత్రుడగు ఈ తపశ్శాలి నదిని దాటగోరుచున్నాడు. నాల్గు వేదముల అంతమును చూచిన ఈ మహర్షి విజ్ఞానమునకు నిధి' (6, 7). తండ్రి ఇట్లు కోరగా, ఆ మత్స్యగంధ సూర్యునితో సమానమగు కాంతి గల ఆ మహర్షి కూర్చుండియున్న నావను నడుపుచుండెను (8). ఎన్నడైనను అప్సరసల రూపమునకు కూడ మోహితుడు కాని ఆ మహాయోగి కాలమహిమచే ఆమె యందు కామనచే పీడింపబడెను (9). ఆ ముని మనోహారిణి యగు ఆ పల్లెపిల్లను పట్టుకొనగోరెను. ఆయన తన కుడి ఏతితో ఆమె కుడిచేతిని స్పృశించెను (10). నిడివి కన్నుల ఆ సుందరి చిరునవ్వు నవ్వి ఆయనతో నిట్లనెను :వాక్కుపై నియంత్రణ గల ఓ మహాబుద్ధిశాలీ! నీవు ఇట్టి మిక్కిలి నిందింపదగిన కర్మను ఏల చేయుచున్నావు ? నీవు సుందరమగు వసిష్ఠుని కులములో జన్మించితివి. ఓ బ్రాహ్మణా! నేను పల్లె పిల్లను. మన ఇద్దరి సమాగమము ఎట్లు ఘటిల్లును ?(11,12) మనుష్య జన్మ దుర్లభ##మైనది. బ్రాహ్మణత్వము మరింత దుర్లభము. ఓ మహర్షీ ! తపశ్శాలి కాగల్గుట ఇంకనూ కఠినము (13). విద్య, సుందరమగు దేహము, మాటలాడే సామర్థ్యము, గొప్ప కులము మరియు మంచి శీలము అను వాటితో గూడియున్న నీవు ఇచట మన్మథబాణ పీడితుడవగుట పెద్ద ఆశ్చర్యము గదా ! (14) తప్పు పనిని చేయుటకు పూనుకున్న ఈ యోగిని వారించే సామర్థ్యము భూలోకములో ఎవ్వరికైననూ లేదు. ఏలయనగా, ఆయన శపించునేమో యను భయము గలదు (15).

ఇతి సంచింత్య హృదయే నిజగాద మహామునిమ్ | తావద్ధైర్యం కురు స్వామిన్ యావత్త్వాం పారయామి న || 16

ఇతి శ్రుత్వా వచస్తస్యా యోగిరాజః పరాశరః | తత్యాజ పాణిం తరసా సింధోః పారం గతః పునః || 17

పునర్జగ్రాహ తాం బాలాం మునిః కామప్రపీడితః | కంపమానా తు సా బాలా తమువాచ దయానిధిమ్ || 18

దుర్గంధాహం మునిశ్రేష్ఠ కృష్ణవర్ణా నిషాదజా | భవాంస్తు పరమోదారవిచారో యోగిసత్తమః || 19

నావయోర్ఘటతే సంగో కాచకాంచనయోరివ | తుల్యజాత్యాకృతికయోస్సంగస్సౌఖ్యప్రదో భ##వేత్ || 20

ఇత్యుక్తేన తయా తేన క్షణమాత్రేణ కామినీ | కృతా యోజనగంధా తు రమ్యరూపా మనోరమా || 21

పునర్జగ్రాహ తాం బాలాం స మునిః కామపీడితః | గ్రహీతు కామం తం దృష్ట్వా పునః ప్రోవాచ వాసవీ || 22

రాత్రౌ వ్యవాయః కర్తవ్యో న దివేతి శ్రుతిర్జగౌ | దివాసంగే మహాన్ దోషో నిందా చాపి దురాసదా || 23

తస్మాత్తావత్ర్పతీక్షస్వ యావద్భవతి యామినీ | పశ్యంతి మానవాశ్చాత్ర పితామే చ తటే స్థితః || 24

తయోక్తమిదమాకర్ణ్య వచనం మునిపుంగవః | నీహారం కల్పయామాస సద్యః పుణ్యబాలేన వై || 25

నీహారే చ సముత్పన్నే తమసా రాత్రి సంనిభే | వ్యవాయచకితా బాలా పునః ప్రోవాచ తం మునిమ్ || 26

యోగిన్నమోఘవీర్యస్త్వం భుక్త్వా గంతాసి మాం యది | సగర్భాస్యాం తదా స్వామిన్ కా గతిర్మే భ##వేదితి || 27

కన్యావ్రతం మహాబుద్ధే మమ నష్టం భవిష్యతి | హసిష్యంతి తదా లోకాః పితరం కిం బ్రవీమ్యహమ్ || 28

ఆమె తన మనస్సులో నిట్లు తలపోసి ఆ మహర్షితో నిట్లనెను : ఓ స్వామీ ! నేను నిన్ను ఆవలి తీరమునకు చేర్చునంతవరకు ధైర్యము నవలంబించుము (16). యోగీశ్వరుడగు పరాశరుడు ఆమె యొక్క ఈ వచనమును విని వెంటనే చేతిని విడిచిపెట్టెను. ఇంతలో వారు నది ఆవలి తీరమునకు చేరిరి (17). మన్మథ పీడితుడైన ఆ ముని ఆ కన్యను మరల పట్టుకొనెను. ఆ కన్య వణికి పోతూ దయాసముద్రుడగు ఆ మహర్షితో నిట్లనెను (18). ఓ మహర్షీ! నేను చెడు వాసన గల, నల్లని దేహవర్ణము గల పల్లె పిల్లను. కాని, నీవు సర్వోత్కృష్టమగు జ్ఞానము గల యోగి శ్రేష్ఠుడవు (19). బంగారమునకు గాజు పూసతో వలె నీకు నాతో పొత్తు పొసగదు. సమానమగు జాతి మరియు ఆకారము గల వారి మధ్య పొత్తు సుఖములనిచ్చును (20). ఆమె ఇట్లు పలుకగా మరుక్షణములో ఆయన ఆమెను మనోహరము, రమ్యము అగు రూపము గల యోజన గంధ (యోజన దూరము వరకు ప్రసరించే పరిమళము గలది) నుగా తీర్చిదిద్దెను (21). మన్మథ పీడితుడైన ఆ ముని ఆ కన్యను మరల పట్టుకొనెను. తనను పట్టుకొనగోరుచున్న ఆ మునిని గాంచి ఆ పల్లె పిల్ల మరల ఇట్లనెను (22). సంభోగమును రాత్రియందే గాని పగలు చేయరాదని వేదము చెప్పుచున్నది. పగటి సంభోగమునందు పెద్ద దోషము, మరియు అతిక్రమింప శక్యము కాని నింద గలవు (23). కావున రాత్రి వచ్చునంత వరకు వేచియుండుము. పైగా ఇచట మనుష్యులు చూడగలరు. ఒడ్డుపై నా తండ్రి కూడ ఉన్నాడు (24). ఆమె యొక్క ఈ పలుకులను విని వెంటనే ఆ మహర్షి పుణ్యప్రభావముచే పొగమంచును సృష్టించెను (25). పొగమంచు అంతటా నిండి రాత్రియందు వలె చీకటి అలముకొనెను. అపుడు సంభోగమునకు భయపడిన ఆ కన్య మరల ఆ మునితో నిట్లనెను (26). ఓ యోగీ! నీ

సామర్ధ్యము తిరుగు లేనిది. నీవు నన్ను అనుభవించి వెళ్లిన పిదప నేను గర్భవతిని అగుదును. ఓ స్వామీ ! అపుడు నా గతి ఏమగును? (27). ఓ మహాబుద్ధిశాలీ ! నా కన్యావ్రతము భగ్నమగును. అపుడు జనులు నన్ను పరిహసించెదరు. నేను తండ్రికి ఏమని చెప్పగలను ? (28)

పరాశర ఉవాచ |

రమ బాలే మయా సార్ధం స్వచ్ఛందం కామజై రసైః |
స్వయాభిలాషమాఖ్యాహి పూరయామ్యధునా ప్రియే || 29

మదాజ్ఞా సత్య కరణాన్నామ్నా సత్యవతీ భవ | వందనీయా తథాశేషై ర్యోగిభిస్త్రి దశైరపి || 30

పరాశరుడిట్లు పలికెను -

ఓ కన్యా ! ప్రేమతో నిండిన మనోభావములతో గూడియున్న దానవై నాతో యథేచ్ఛగా రమించుము. ఓ ప్రియురాలా ! నీ కోరికను వెల్లడించుము. నేను ఇప్పుడే తీర్చెదను (29). నా ఆజ్ఞను సత్యము చేయుటచే నీకు సత్యవతి అను పేరు ప్రసిద్ధిని గాంచగలదు.మరియు సర్వయోగులు, దేవతలు కూడ నీకు నమస్కరించెదరు (30).

సత్యవత్యువాచ |

జానతే న పితా మాతా న వాన్యే భువి మానవాః | కన్యాధర్మో న మే హన్యాద్యది స్వీకురు మాం తదా || 31

పుత్రశ్చ త్వత్సమో నాథ భ##వేదద్భుతశక్తిమాన్ | సౌగంధ్యం సర్వదాంగే మే తారుణ్యం చ నవం నవమ్ || 32

సత్యవతి ఇట్లు పలికెను -

నా తండ్రికి గాని, తల్లికి గాని, భూలోకములోని ఇతర మానవులకు గాని తెలియరాదు. నా కన్యాధర్మమునకు భంగము కలుగరాదు. అట్లు సంభవమైనచో,నన్ను స్వీకరించుము (31). ఓ ప్రభూ ! నాకు నీతో సమానమైనవాడు, అద్భుతమగు శక్తి గలవాడు అగు పుత్రుడు కలుగవలెను. నా శరీరమునందు పరిమళము సర్వకాలములలో నుండవలెను. నాకు ¸ౌవనము నిత్యనూతనముగా నుండవలెను (32).

పరాశర ఉవాచ |

శృణు ప్రియే తవాభీష్టం సర్వం పూర్ణం భవిష్యతి | విష్ణ్వంశ సంభవః పుత్రో భవితా తే మహాయశాః || 33

కించిద్దైవ కారణం విద్ధి యతో%హం కామపీడితః | దృష్ట్వా చాప్సరసాం రూపం నాముహ్యన్మే మనః క్వచిత్ || 34

మీన గంధాం సమాలక్ష్య త్వాం మోహవశగో%భవమ్ | న బాలే భాలపట్ట స్థో బ్రహ్మలేఖో%న్యథా భ##వేత్ || 35

పురాణకర్తా పుత్ర స్తే వేదశాఖావిభాగకృత్ | భవిష్యతి వరారోహే ఖ్యాత కీర్తిర్జగత్త్రయే || 36

ఇత్యుక్త్వా తాం సురమ్యాంగీంభుక్త్వా యోగవిశారదః | వవ్రాజ శీఘ్రం యమునా జలే స్నాత్వా మహామునే || 37

సాపి గర్భం దధారాశు ద్వాదశాత్మ సమప్రభమ్ | అసూత సూర్యజాద్వీపే కామదేవమివాత్మజమ్ || 38

వామే కమండలుం బిభ్రద్దక్షిణ దండముత్తమమ్ | పిశంగీభిర్జటాభిశ్చ రాజితో మహసాం చయః || 39

జాతమాత్రస్తు తేజస్వీ మాతరం ప్రత్యభాషత | గచ్ఛ మాతర్యథాకామం గచ్ఛామ్యహమతః పరమ్ || 40

మాతర్యదా భ##వేత్కార్యం తవ కించిద్ధృదీప్సితమ్ |
సంస్మృతశ్చాగమిష్యామి త్వదిచ్ఛాపూర్తి హేతవే || 41

ఇత్యుక్త్వా మాతృచరణావభివాద్య తపోనిధిః | జగామ చ తపః కర్తుం తీర్థం పాపవిశోధనమ్ || 42

సాపి పిత్రంతికం యాతా పుత్రస్నేహాకులా సతీ | స్మరంతీ చరితం సూనో ర్వర్ణయంతీ స్వభాగ్యకమ్ || 43

పరాశరుడు ఇట్లు పలికెను -

ఓ ప్రియురాలా ! వినుము. నీ కోరిక పూర్తిగా నెరవేరగలదు. నీకు విష్ణువు యొక్క అంశతో పుట్టే గొప్ప కీర్తిమంతుడగు పుత్రుడు కలుగును (33). అప్సరసల రూపమును చూచిన సమయములోనైననూ నా మనస్సు మోహమును పొందదు. అట్టి నేను మన్మథునిచే పీడింపబడుటకు ఏదో ఒక కారణము ఉండియుండునని తెలుసుకొనుము (34). మత్స్యగంధయగు నిన్ను చూచి నేను మోహమునకు వశుడనైతిని. ఓ సుందరీ !బ్రహ్మ నుదిటిపై వ్రాసిన వ్రాతకు తిరుగు లేదు (35). నీ పుత్రుడు పురాణములను రచించి వేదమును శాఖారూపముగా విభజించగలడు. ఓ సుందరీ ! అతని కీర్తి ముల్లోకములలో ప్రసిద్ధిని పొందగలదు (36). యోగనిష్ణాతుడగు ఆ మహర్షి ఇట్లు పలికి ఆ సుందరమగు అవయవములు గల యువతితో రమించి యమునా జలములో స్నానము చేసి వెంటనే వెళ్లిపోయెను. ఓ మహర్షీ! (37) ఆమె వెంటనే గర్భమును దాల్చి యమునా ద్వీపములో సూర్యునితో సమానమగు కాంతి గలవాడు, మన్మథుని వలె సుందరమైన వాడు అగు పుత్రుని కనెను (38). ఆయన ఎడమచేతిలో కమండలమును, కుడిచేతిలో గొప్ప దండమును ధరించెను. ఆతేజోనిధి తేనె రంగు గల జటలతో ప్రకాశించెను (39). ఆ తేజశ్శాలి పుట్టిన వెంటనే తల్లితో నిట్లనెను : ఓ తల్లీ ! నీవు యథేచ్ఛగా వెళ్లుము. నేను కూడ ఇచటి నుండి వెళ్లుచున్నాను (40). ఓ తల్లీ ! నీకు నాతో ఏదేని పని కలిగినప్పుడు, నీ మనస్సులో ఏదేని కోరిక కలిగినప్పుడు నన్ను స్మరించుము. నేను

వెంటనే వచ్చి నీ కోరికను పూర్తి చేయగలను (41). ఆ తపశ్శాలి ఇట్లు పలికి తల్లి పాదములకు నమస్కరించి తపస్సును చేయుట కొరకై పాపమును నిర్మూలించే తీర్థమునకు వెళ్లెను (42). పుత్రుని యందలి ప్రేమచే దుఃఖితురాలై యున్న ఆమె పుత్రుని గొప్పదనమును స్మరిస్తూ తన భాగ్యమును కొనియాడుతూ తండ్రి వద్దకు వెళ్లెను (43).

ద్వీపే జాతో యతో బాలస్తేన ద్వైపాయనో%భవత్ |
వేదశాఖావిభజనాద్వేదవ్యాసః ప్రకీర్తితః || 44

తీర్థరాజం ప్రథమతో ధర్మకామార్థమోక్షదమ్ | నైమిషం చ కురుక్షేత్రం
గంగా ద్వారమవంతికామ్ || 45

అయోధ్యాం మథురాం చైవ ద్వారకామమరావతీమ్ | సరస్వతీం
సింధుసంగం గంగాసాగరసంగమమ్ || 46

కాంచీం చ త్ర్యంబకం చాపి సప్త గోదావరీతటమ్ | కాలంజరం
ప్రభాసం చ తథా బదరికాశ్రమమ్ || 47

మహాలయం తథోంకారక్షేత్రం వైపురుషోత్తమమ్ | గోకర్ణం భృగుకచ్ఛం
చ భృగు తుంగం చ పుష్కరమ్ || 48

శ్రీ పర్వతాది తీర్థాని ధారాతీర్థం తథైవ చ | గత్వావగాహ్య విధినా
చచార పరమం తపః || 49

ఏవం తీర్థాన్యనేకాని నానాదేశస్థితాని హ | పర్యటన్ కాలికాసూనుః
ప్రాపద్వారాణసీం పురీమ్ || 50

యత్ర విశ్వేశ్వరస్సాక్షాదన్నపూర్ణా మహేశ్వరీ | భక్తానామమృతం
దాతుం విరాజేతే కృపానిధీ || 51

ప్రాప్య వారాణసీతీర్థం దృష్ట్వా థ మణి కర్ణికామ్ | కోటి జన్మార్జితం
పాపం తత్యాజ స మునీశ్వరః || 52

దృష్ట్వా లింగాని సర్వాణి విశ్వేశప్రముఖాని చ | స్నాత్వా సర్వేషు కుండేషు వాపీకూపసరస్సు చ || 53

నత్వా వినాయకాన్ సర్వాన్ గౌరీస్సర్వాః | ప్రణమ్యచ | సంపూజ్య కాలరాజం చ భైరవం పాపభక్షణమ్ || 54

ఆ బాలకుడు ద్వీపమునందు పుట్టుటచే ద్వైపాయనుడనియు, వేదమును శాఖల రూపములో విభజించుట వలన వేదవ్యాసుడనియు ప్రసిద్ధిని పొందెను (44). ఆయన మున్ముందుగా ధర్మార్థకామమోక్షములనిచ్చే తీర్థములలో శ్రేష్ఠమైన నైమిషమును దర్శించి, తరువాత కురుక్షేత్రమును,గంగాద్వారమును, అవంతికను (45), అయోధ్యను, మథురను, ద్వారకను, అమరావతిని, సరస్వతిని, సింధునదీ సంగమమును, గంగ సముద్రములో కలిసే సంగమస్థానమును (46), కాంచి, త్ర్యంబకము, గోదావరీ తీరమందలి ఏడు క్షేత్రములు, కాలంజరము, ప్రభాసము, బదరికాశ్రమము (47), మహాలయము, ఓంకారక్షేత్రము, పురుషోత్తమము, గోకర్ణము, భృగుకచ్ఛము, భృగుతుంగము, పుష్కరము, శ్రీ పర్వతము మొదలగు తీర్థములను, మరియు ధారాతీర్థమును చేరి యథావిధిగా స్నానమును చేసి, గొప్ప తపస్సును చేసెను (48, 49). కాలికా (సరస్వతీ) పుత్రుడగు వ్యాసుడు ఈ విధముగా వివిధ ప్రాంతములయందు గల అనేక తీర్థములలో పర్యటిస్తూ వారాణసీ నగరమును చేరెను (50). అచట దయానిధులగు అన్నపూర్ణా విశ్వేశ్వరులు భక్తులకు మోక్షమునిచ్చుట కొరకై విరాజిల్లుచున్నారు (51). ఆ మహర్షి వారణాసీ తీర్థమును, తరువాత మణికర్ణికను సేవించి కోటి జన్మలలో చేసిన పాపమును పోగొట్టుకొనెను (52). విశ్వేశ్వరుడు మొదలగు లింగములన్నింటినీ చూచి, కుండములు బావులు దిగుడు బావులు సరస్సులు అన్నింటియందు స్నానమును చేసి, వినాయకులకు గౌరీ దేవతలకు అందరికీ ప్రణమిల్లి, ఆయన కాలరాజును మరియు పాపములను నశింపజేసే భైరవుని దర్శించెను (53, 54).

దండనాయక ముఖ్యాంశ్చ గణాన్ స్తుత్వా ప్రయత్నతః |
ఆదికేశవముఖ్యాంశ్చ కేశవాన్ పరితోష్య చ || 55

లోలార్క ముఖ్య సూర్యాంశ్చ ప్రణమ్య చ పునః పునః | కృత్వా
పిండప్రదానాని సర్వతీర్థేష్వతంద్రితః || 56

స్థాపయామాస పుణ్యాత్మా లింగం వ్యాసేశ్వరాభిధమ్ |
యద్దర్శనాద్భవేద్విప్రా నరో

విద్యాసు వాక్పతిః || 57

లింగాన్యభ్యర్చ్య విశ్వేశప్రముఖాని సుభక్తితః | అసకృచ్చింతయామాస
కిం లింగం క్షిప్రసిద్ధిదమ్ || 58

యమారాధ్య మహాదేవం విద్యాస్సర్వా లభే మహి |
పురాణకర్తృతాశక్తిర్మమాస్తు యదనుగ్రహాత్ || 59

శ్రీమదోంకారనాథం వా కృత్తివాసేశ్వరం కిము | కేదారేశం తు కామేశం
చంద్రేశం వా త్రిలోచనమ్ || 60

కాలేశం వృద్ధకాలేశం కాలశేశ్వరమేవ వా | జ్యేష్ఠేశం జంబుకేశం వా
జైగీషత్యేస్వరం తు వా || 61

దశాశ్వమేధమీశానం ద్రుమిచండేశ##మేవ వా | దృక్కేశం గరుడేశం
వా గోకర్ణేశం గణ   శ్వరమ్ || 62

ప్రసన్నవదనేశం వా ధర్మేశం తారకేశ్వరమ్ | నందికేశం నివాసేశం
పత్రీశం ప్రతికేశ్వరమ్ || 63

పర్వతేశం పశుపతిం హాటకేశ్వరమేవ వా | బృహస్పతీశ్వరం వాథ
తిలభాండేశ##మేవ వా || 64

భారభూతేశ్వరం కిం వా మహాలక్ష్మీశ్వరం తు వా | మరుతేశం తు
మోక్షేశం గంగేశం నర్మదేశ్వరమ్ || 65

దండనాయకుడు మొదలగు గణములను ప్రయత్నపూర్వకముగా స్తుతించి, ఆదికేశవుడు మొదలగు కేశవులను సంతోషపెట్టి (55), లోలార్కుడు మొదలగు సూర్యదేవతలకు పలుమార్లు మ్రొక్కి, తీర్థములన్నింటి యందు నిర్లక్ష్య భావన లేకుండగా పిండదానములను చేసి (56), ఆ పుణ్యాత్ముడు వ్యాసేశ్వరుడనే లింగమును స్థాపించెను. ఓ బ్రాహ్మణులారా ! దాని దర్శనము వలన మానవుడు విద్యలలో బృహస్పతియగును (57). ఆయన విశ్వేశ్వరుడు మొదలగు లింగములను మహాభక్తితో చక్కగా పూజించి, ' ఏ లింగము శీఘ్రముగా సిద్ధిని కలుగజేయును ?' అని పలుమార్లు ఆలోచించెను (58). ఏ మహాదేవుని ఆరాధించినచో, మనము సకలవిద్యలను పొందగలము? ఎవ్వాని అనుగ్రహము వలన నాకు పురాణములను నిర్మించే శక్తి కలుగును ? (59) శ్రీ మదోంకారనాథుడు, కృత్తివాసేశ్వరుడు, కేదారేశ్వరుడు, కామేశ్వరుడు, ముక్కంటియగు చంద్రేశ్వరుడు, కాలేశ్వరుడు, వృద్ధ కాలేశ్వరుడు, కాలశేశ్వరుడు, జ్యేష్ఠేశ్వరుడు, జంబుకేశ్వరుడు, జైగీషవ్యేశ్వరుడు, దశాశ్వమేధేశ్వరుడు, ద్రుమిచండేశ్వరుడు, దృక్కేశ్వరుడు, గరుడేశ్వరుడు, గోకర్ణేశ్వరుడు, గణ   శ్వరుడు, ప్రసన్నవదనేశ్వరుడు, ధర్మేశ్వరుడు, తారకేశ్వరుడు, నందికేశ్వరుడు, నివాసేశ్వరుడు, పత్రీశ్వరుడు, ప్రతికేశ్వరుడు, పర్వతేశ్వరుడు, పశుపతీశ్వరుడు, హాటకేశ్వరుడు, బృహస్పతీశ్వరుడు, తిలభాండేశ్వరుడు, భారభూతేశ్వరుడు, మహాలక్ష్మీశ్వరుడు, మరుతేశ్వరుడు, మోక్షేశ్వరుడు, గంగేశ్వరుడు, నర్మదేశ్వరుడు అను వారిలో ఎవరిని ఆరాధించవలెను ? (60-65)

కృష్ణేశం పరమేశానం రత్నేశ్వరమథాపి వా | యామునేశం లాంగలీశం శ్రీమద్విశ్వేశ్వరం విభుమ్ || 66

అవిముక్తేశ్వరం వాథ విశాలాక్షీశ##మేవ వా | వ్యాఘ్రేశ్వరం వరాహేశం విద్యేశ్వరమథాపి వా || 67

వరుణ   శం విధీశం వా హరికేశేశ్వరం తు వా | భవానీశం కపర్దీశం కందుకేశమజేశ్వరమ్ || 68

విశ్వకర్మేశ్వరం వాథ వీరేశ్వరమథాపి వా | నాదేశం కపిలేశం చ భువనేశ్వరమేవ వా || 69

బాష్కలీశం మహాదేవం సిద్ధీశ్వరమథాపి వా | విశ్వేదేవేశ్వరం వీరభ##ద్రేశం భైరవేశ్వరమ్ || 70

అమృతేశం సతీశం వా పార్వతీశ్వరమేవ వా | సిద్ధేశ్వరం మతంగేశం భూతీశ్వరమథాపి వా || 71

ఆషాఢీశం ప్రకామేశం కోటిరుద్రేశ్వరం తథా | మదాలసేశ్వరం చైవ తిలపర్ణేశ్వరం కిము || 72

కిం వా హిరణ్య గర్భేశం కిం వా శ్రీ మధ్యమేశ్వరమ్ | ఇత్యాది కోటిలింగానాం మధ్యే%హం కిముపాశ్రయే || 73

ఇతి చింతాతురో వ్యాస శ్శివభక్తిరతాత్మవాన్ | క్షణం విచారయామాస ధ్యానసుస్థిర చేతసా || 74

ఆ జ్ఞాతం విస్మృతం తావన్నిష్పన్నో మే మనోరథః | సిద్ధైస్సంపూజితం లింగం ధర్మకామార్ధమోక్షదమ్ || 75

దర్మనాత్ స్పర్శనాద్యస్య చేతో నిర్మలతామియాత్ | ఉద్ఘాటితం సదైవాస్తి ద్వారం స్వర్గస్య యత్ర హి || 76

అవిముక్తే మహాక్షేత్రే సిద్ధక్షేత్రే హి తత్పరమ్ | యత్రాస్తే పరమం లింగం మధ్యమేశ్వర సంజ్ఞకమ్ || 77

కృష్ణేశ్వరుడు, పరమేశ్వరుడు, రత్నేశ్వరుడు, యామునేశ్వరుడు, లాంగలీశ్వరుడు, శ్రీమద్విశ్వేశ్వరవిభుడు, అవిముక్తేశ్వరుడు, విశాలాక్షీశ్వరుడు, వ్యాఘ్రేశ్వరుడు, వరాహేశ్వరుడు, విద్యేశ్వరుడు, వరుణ   శ్వరుడు, విధీశ్వరుడు, హరికేశేశ్వరుడు, భవానీశ్వరుడు,

కపర్దీశ్వరుడు, కందుకేశ్వరుడు, అజేశ్వరుడు, విశ్వకర్మేశ్వరుడు, వీరేశ్వరుడు, నాదేశ్వరుడు, కపిలేశ్వరుడు, భువనేశ్వరుడు, బాష్కలీశుడు, మహాదేవుడు, సిద్ధీశ్వరుడు, విశ్వేదేవేశ్వరుడు, వీరభ##ద్రేశ్వరుడు, భైరవేశ్వరుడు, అమృతేశుడు, సతీశుడు, పార్వతీశ్వరుడు, సిద్దేశ్వరుడు, మతంగేశ్వరుడు, భూతీశ్వరుడు, ఆషాఢీశుడు, ప్రకామేశుడు, కోటిరుద్రేశ్వరుడు, మదాలసేశ్వరుడు, తిలపర్ణేశ్వరుడు, హిరణ్య గర్భేశుడు, శ్రీమధ్యమేశ్వరుడు మొదలగు కోటి లింగములలో నేను దేనిని ఆశ్రయించవలెను ? (66-73) శివభక్తి భరితమగు హృదయముగల వ్యాసుడు ఈ విధమగు చింతచే పీడింపబడినవాడై క్షణ కాలము ధ్యానమునందు స్థిరమైన మనస్సుతో విచారించెను (74). ఆ ! తెలిసినది. నేను మరచితిని. నా కోరిక తీరినది. ధర్మార్థకామ మోక్షములనిచ్చునది, సిద్ధులచే చక్కగా పూజింపబడినది అగు లింగము కలదు (75). దానిని దర్శించి స్పృశించుట వలన మనస్సు నిర్మలమగును. అది సర్వదా స్వర్గద్వారమును తెరచియుంచును (76). అది సిద్ధులచే సేవింపబడే అవిముక్తమనే మహాక్షేత్రములో గలదు. ఆశ్రేష్ఠలింగమునకు మధ్యమేశ్వరుడని పేరు (77).

న మధ్యమేశ్వరాదన్యల్లింగం కాశ్యాం హి విద్యతే |
యద్దర్శనార్థమాయాంతి దేవాః పర్వణి పర్వణి || 78

అతస్సేవ్యో మహాదేవో మధ్యమేశ్వరసంజ్ఞకః | అస్యారాధనతో విప్రా బహవస్సిద్ధిమాగతాః || 79

యః ప్రధానతయా కాశ్యామధ్యే తిష్ఠతి శంకరః |
స్వపురీజనసౌఖ్యార్థమతో%సౌ మధ్యమేశ్వరః || 80

తుంబురుర్నామ గంధర్వో దేవర్షిర్నారదస్తథా | అముమారాధ్య సంపన్నౌ గానవిద్యావిశారదౌ || 81

అముమేవ సమారాధ్య విష్ణుర్మోక్షప్రదో%భవత్ | బ్రహ్మా విష్ణుశ్చ రుద్రశ్చ స్రష్టృపాలకహారకాః || 82

ధనాధీశః కుబేరోఽపి వామదేవో హి శైవరాట్ | ఖట్వాంగో నామ భూపాలోఽ సపత్నోఽపత్యవానభూత్ || 83

అప్సరాశ్చంద్రభామాఖ్యా నృత్యంతీ నిజభావతః | సదేహా కోకిలాలాపా లింగమధ్యే లయం గతా || 84

శ్రీకరో గోపికా సూనుస్సేవితా మధ్యమేశ్వరమ్ | గాణపత్యం సమాలేభే శివస్య కరుణాత్మనః || 85

భార్గవో గీష్పతిశ్చోభౌ దేవౌ దైత్యసురార్చితౌ | విద్యాపారంగమౌ జాతౌ ప్రసాదాన్మధ్యమేశితుః || 86

అహమప్యత్ర సంపూజ్య మధ్యమేశ్వరమీశ్వరమ్ | పురాణ కర్తృతా శక్తిం ప్రాప్స్యామి తరసా ధ్రువమ్ || 87

ఇతి కృత్వా మతిం ధీరో వ్యాసస్సత్యవతీసుతః | భాగీరథ్యంభసి స్నాత్వా జగ్రాహ నియమం వ్రతీ || 88

మధ్యమేశ్వరుని కంటె వేరొక లింగము కాశీలో లేదు. దేవతలు పర్వదినములన్నింటియందు దానిని దర్శించుటకు వచ్చుచుందురు (78). కావున మధ్యమేశ్వరుడనే పేరు గల మహాదేవుని సేవించదగును. ఓ బ్రాహ్మణులారా! ఆయనను సేవించి అనేకులు సిద్ధిని పొందిరి (79). శంకరుడు తన నగరమగు కాశీలోని జనుల సౌకర్యము కొరకై ప్రధానముగా ఆ నగర మధ్యములో నున్నాడు. కావుననే, ఆయన మధ్యమేశ్వరుడైనాడు (80). తుంబురుడనే గంధర్వుడు, దేవర్షియగు నారదుడు ఈయనను ఆరాధించి సంగీతవిద్యలో నిష్ణాతులైనారు (81). ఈయనను ఆరాధించి విష్ణువు మోక్షమునిచ్చువాడు అయినాడు. బ్రహ్మ సృష్టికర్త అయినాడు. విష్ణువు పాలకుడు. రుద్రుడు సంహారకుడు అయినారు (82). కుబేరుడు ధనాధ్యక్షుడైనాడు. వామదేవుడు శివభక్తులకు అధీశ్వరుడైనాడు. సంతానము లేని ఖట్వాంగుడనే రాజు సంతానమును పొందినాడు (83). చంద్రభాను యను అప్సరస భక్తి

పూర్ణమగు మనస్సు గలదై నృత్యము చేయుచూ కోకిలవలె గానము చేయుచూ లింగ మధ్యములో దేహముతో సహా లయమును పొందెను (84). శ్రీకరుడనే గొల్లపిల్లడు మధ్యమేశ్వరుని సేవించి కరుణాహృదయుడగు శివుని గణాధ్యక్షస్థానమును పొందినాడు (85). గురు శుక్రులిద్దరు మధ్యమేశ్వరుని అనుగ్రహము వలన విద్యావిశారదులగు దేవతలై క్రమముగా దేవతలచే మరియు అసురులచే పూజింపబడుచుండిరి (86). నేను కూడ ఇచట జగన్నాథుడగు మధ్యమేశ్వరుని పూజించి పురాణములను రచించే శక్తిని శీఘ్రముగా నిశ్చయముగా పొందగలను (87). వివేకి. సత్యవతీ పుత్రుడు, వ్రతశీలుడు అగు వ్యాసుడు ఈ విధముగా నిశ్చయించుకొని గంగాజలములో స్నానమును చేసి నియమమును స్వీకరించెను (88).

క్వచిత్పర్ణాశనో భూత్వా ఫలశాకాశనః క్వచిత్ | వాతభుక్ జలభుగ్వాపి క్వచిన్నిరశనవ్రతీ || 89

ఇత్యాదినియమైర్యోగీ త్రికాలం మధ్యమేశ్వరమ్ | పూజయామాస ధర్మాత్మా నానావృక్షద్భవైః ఫలైః || 90

ఇత్థం బహుతిథే కాలే వ్యతీతే కాలికా సుతః | స్నాత్వా త్రిపథగా తోయే యావదాయాతి స ప్రగే || 91

మధ్యమేశ్వరమీశానం భక్తాభీష్టవరప్రదమ్ | తావద్దదర్శ పుణ్యాత్మా మధ్యే లింగం మహేశ్వరమ్ || 92

ఉమాభూషితవామాంగం వ్యాఘ్రచర్మోత్తరీయకమ్ | జటాజూటచలద్గంగా తరంగైశ్చారు విగ్రహమ్ || 93

లసచ్చారదబాలేందు చంద్రికా చందితాలకమ్ | భస్మోద్ధూలితసర్వాంగం కర్పూరార్జునవిగ్రహమ్ || 94

కర్ణాంతాయతనేత్రం చ విద్రుమారుణదచ్ఛదమ్ | పంచవర్షాకృతిం బాలం బాలకోచిత భూషణమ్ || 95

దధానం కోటి కందర్ప దర్పహాని తనుద్యుతిమ్ | నగ్నం ప్రహసితాస్యాబ్జం గాయంతం సామ లీలయా || 96

కరుణాపారపాథోధిం భక్తవత్సల నామకమ్ | ఆశుతోషముమాకాంతం ప్రసాదసుముఖం హరమ్ || 97

సమాలోక్య స్తుతిం చక్రే ప్రేమ గద్గదయా గిరా | యోగినా మప్యగమ్యం తం దీనబంధుం చిదాత్మకమ్ || 98

ఒకప్పుడు ఆకులను, మరియొకప్పుడు పండ్లను, కాయలను, మరియొకప్పుడు గాలిని నీటిని మాత్రమే ఆహారముగా తీసుకొని, మరియొకప్పుడు నిరహారవ్రతమును బూని (89), ధర్మాత్ముడు, యోగి యగు ఆ వ్యాసుడు ఈ విధమగు నియమములతో వివిధ వృక్షముల నుండి పుట్టిన ఫలములతో మధ్యమేశ్వరుని మూడు కాలములయందు పూజించెను (90). ఈ విధముగా చాల రోజులు గడిచెను. ఒకనాడు కాలికాపుత్రుడగు ఆ వ్యాసుడు ఉదయమే గంగా జలములో స్నానమును చేసి వచ్చునంతలో (91), లోకపాలకుడు, భక్తులకు అభీష్టమగు వరములనిచ్చువాడు, మహేశ్వరుడు అగు మధ్యమేశ్వరుని లింగమధ్యములో చూచెను. ఆ పుణ్యాత్ముడగు వ్యాసుడు, పార్వతిచేఅలంకృతమై యున్న వామ భాగము గలవాడు, పెద్దపులి చర్మము ఉత్తరీయముగా ధరించినవాడు, జటాజూటమునందు కదలాడే గంగయొక్క తరంగములచే సుందరమైన దేహము గలవాడు, ప్రకాశించే శరత్కాల బాలచంద్రుని వెన్నెలలచే ప్రకాశింపచేయబడే ముంగురులు గలవాడు, భస్మచే పూయబడిన సర్వాయవములు గలవాడు, కర్పూరము వలె తెల్లని దేహము గలవాడు, చెవుల వరకు వ్యాపించిన కన్నులు గలవాడు, పగడముల వలె ఎర్రనైన పెదవులు గలవాడు, అయిదేండ్ల బాలకుని రూపమును దాల్చి బాలకునకు తగిన ఆభరణములను ధరించినవాడు, కోటి మన్మథుల గర్వమునడంచే శరీర కాంతి గలవాడు, నగ్నముగా నున్నవాడు, నవ్వులతో నిండిన పద్మము వంటి మోము గలవాడు, అవలీలగా సామగానమును

చేయుచున్నవాడు, అంతములేని కరుణకు సముద్రము వంటివాడు, భక్తవత్సలుడని ఖ్యాతిని పొందినవాడు. తేలికగా ప్రసన్నమగు వాడు, పార్వతీప్రియుడు, అనుగ్రహించుటకు సుముఖముగా నున్నవాడు అగు శివుని చూచి, ప్రేమతో గద్గదమైన వాక్కుతో యోగులకైననూ పొందశక్యము కానివాడు, దీనులకు బంధువు, జ్ఞానస్వరూపుడు అగు ఆయనను స్తుతించెను (92-98).

వేదవ్యాస ఉవాచ|

దేవదేవ మహాభాగ శరణా గతవత్సల | వాఙ్మనః కర్మ దుష్ప్రాప యోగినా మప్యగోచర || 99

మహిమానం న తే వేదా విదామాసురుమాపతే | త్వమేవ జగతః కర్తా ధర్తా హర్తా తథైవ చ || 100

త్వమాద్యస్సర్వదేవానాం సచ్చిదానంద ఈశ్వరః | నామగోత్రే న వా తేస్తస్సర్వజ్ఞో%సి సదాశివ || 101

త్వమేవ పరమం బ్రహ్మ మాయాపాశనివర్తకః | గుణత్రయైర్న లిప్తస్త్వం పద్మపత్రమివాంభసా || 102

న తే జన్మ న వా శీలం న దేశో న కులం చ తే | ఇత్థం భూతో%పీశ్వరత్వం త్రిలోక్యాః కామమావహేః || 103

న చ బ్రహ్మాన లక్ష్మీశో న చ సేంద్రా దివౌకసః | న యోగీంద్రా విదుస్తత్త్వం యస్య తం త్వాముపాస్మహే || 104

త్వత్తస్సర్వం త్వం హి సర్వం గౌరీశస్త్వం పురాంతకః | త్వం బాలస్త్వం యువా వృద్ధ స్తంత్వాం హృది యునజ్మ్యహమ్ || 105

నమస్తస్మై#్మ మహేశాయ భక్తధ్యేయాయ శంభ##వే | పురాణపురుషాయాద్ధా శంకరాయ పరాత్మనే || 106

ఇతి స్తుత్వా క్షితౌ యావద్దండవన్నిపపాత సః | తావత్స బాలో హృష్టాత్మా వేదవ్యాసమభాషత || 107

వరం వృణీష్వ భో యోగిన్యస్తే మనసి వర్తతే | నాదేయం విద్యతే కించిద్భక్తాధీనో యతోఽస్మ్యహమ్ || 108

తత ఉత్థాయ హృష్టాత్మా మునిర్వ్యాసో మహాతపాః | ప్రత్యబ్రవీత్కిమజ్ఞాతం సర్వజ్ఞస్య తవ ప్రభో || 109

సర్వాంతరాత్మా భగవాన్ శర్వస్సర్వప్రదో భవాన్ | యాచ్ఞాం ప్రతి నియుంక్తే మాం కిమీశో దైన్యకారిణీమ్ | 110

వేదవ్యాసుడు ఇట్లు పలికెను -

ఓ దేవదేవా! మహాత్మా! నీవు శరణు జొచ్చిన వారియందు వాత్సల్యము గలవాడవు. నీవు వాక్కులకు, మనస్సునకు మరియు కర్మలకు అందవు. యోగులైననూ నిన్ను దర్శించలేరు (99). ఓ పార్వతీపతీ! నీ మహిమను వేదములైననూ తెలియజాలవు. జగత్తును సృష్టించి పాలించి సంహరించువాడవు నీవే (100). సచ్చిదానంద-ఈశ్వరుడవగు నీవే దేవతలందరిలో మొదటివాడవు. ఓ సదాశివా! సర్వమును తెలుసుకునే నీకు పేరు మరియు గోత్రము లేవు (101). మాయాబంధమును నిర్మూలించే పరంబ్రహ్మావు నీవే. తామరాకును నీరువలె నిన్ను మూడు గుణములు స్పృశించలేవు (102). నీకు జన్మ శీలము, దేశము, కులము లేవు. ఇట్టి వాడవైననూ, నీవు స్వీయమగు ఇచ్ఛచే మూడు లోకములకు ఈశ్వరుడవై ఉన్నావు (103). బ్రహ్మ విష్ణువు, ఇంద్రుడు, దేవతలు మరియు యోగిశ్రేష్ఠులు నీ స్వరూపమును తెలియజాలకున్నారు. అట్టి నిన్ను మేము ధ్యానించుచున్నాము (104). సర్వము నీనుండి పుట్టినది. సర్వము నీవే. పార్వతీ పతివి అగు నీవు త్రిపురములను నశింపజేసినావు. బాలుడవు నీవే. యువకుడవు నీవే. వృద్ధుడవు నీవే. నిన్ను నేను హృదయములో ప్రతిష్ఠించుచున్నాను (105). మహేశ్వరుడు, భక్తులచే ధ్యానింపబడువాడు. అనాదిపురుషుడు, మంగళకరుడు అగు

ఆ శంభుపరమాత్మకు అనేక ప్రణామములు (106). ఆ వేదవ్యాసుడు ఇట్లు స్తుతించి నేలపై దండమువలె పడి ప్రణమిల్లెను. అపుడా బాలకుడు సంతసించిన అంతరంగము గలవాడై ఆయనతో నిట్లనెను (107). ఓ యోగీ! నీ మనస్సులో నున్న వరమును కోరుకొనుము. నేను భక్తులకు అధీనుడనై యుందును. కావున, నీకు ఈయదగనిది ఏమియూ లేదు (108). అపుడు మహాతపశ్శాలియగు వ్యాసముని ఆనందముతో నిండిన హృదయము గలవాడై లేచి నిలబడి ఇట్లు బదులిడెను ఓ ప్రభూ!నీవు సర్వజ్ఞుడవు. నీకు తెలియనిది ఏమి గలదు? (109) సర్వప్రాణులకు అంతరాత్మ సర్వసంహారకుడు, సర్వమునిచ్చువాడు అగు భగవానుడు నీవే. ఈశ్వరుడవగు నీవు దైన్యహేతువు అగు యాచనయందు నన్ను ఏల నియోగించుచున్నావు? (110)

ఇతి శ్రుత్వా వచస్తస్య వ్యాసస్యామలచేతసః | శుచి స్మిత్వా మహాదేవో బాలరూపధరో%బ్రవీత్ || 111

స్వచ్ఛమగు అంతఃకరణము గల ఆ వ్యాసుని విని బాలుని రూపములోనున్న మహాదేవుడు స్వచ్ఛమగు చిరునవ్వుతో నిట్లనెన (111).

బాల ఉవాచ|

త్వయా బ్రహ్మవిదాం శ్రేష్ఠ యో%భిలాషః కృతో హృది | అచిరేణైవ కాలేన స భవిష్యత్యసంశయః || 112

కంఠే స్థిత్వా తవ బ్రహ్మన్నంతర్యామ్యహమీశ్వరః | సేతిహాస పురాణాని సమ్యజ్ నిర్యాపయామ్యహమ్ || 113

అభిలాషాష్టకం పుణ్యం స్తోత్రమేతత్త్వయేరితమ్ | వర్షం త్రికాలం పఠనాత్కామదం శంభుసద్మని | 114

ఏతత్ స్తోత్రస్య పఠనం విద్యాబుద్ధి వివర్ధనమ్ | సర్వసంపత్కరం ప్రోక్తం ధర్మదం మోక్షదం నృణామ్ || 115

ప్రాతరుత్థాయ సుస్నాతో లింగమభ్యర్చ్య శాంకరమ్ | వర్షం పఠన్నిదం స్తోత్రం మూర్ఖోఽపి స్యాద్బృహస్పతిః || 116

స్త్రియా వా పురుషేణాపి నియమాల్లింగసన్నిధౌ | వర్షం జప్తమిదం స్తోత్రం బుద్ధిం విద్యాం చ వర్ధయేత్ || 117

ఇత్యుక్త్వా స మహాదేవో బాలో లింగే న్యలీయత | వ్యాసోఽపి ముంచన్నశ్రూణి శివప్రేమాకులోఽభవత్ || 118

ఏవం లబ్ధవరో వ్యాసో మహేశాన్మధ్యమేశ్వరాత్ | అష్టాదశ పురాణాని ప్రణినాయ స్వలీలయా || 119

బ్రాహ్మం పాద్మం వైష్ణవం చశైవం భాగవతం తథా | భవిష్యం నారదీయం చ మార్కండేయమతః పరమ్ || 120

ఆగ్నేయం బ్రహ్మవైవర్తం లింగం వారాహమేవ చ | వామనాఖ్యం తతః కౌర్మం మాత్స్యం గారుడమేవ చ || 121

స్కాందం తథైవ బ్రహ్మాండాఖ్యం పురాణం చ కీర్తితమ్ | యశస్యం పుణ్యదం నృణాం శ్రోతౄణాం శాంకరం యశః || 122

బాలకుడు ఇట్లు పలికెను -

బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠమైనవాడా! నీ హృదయములో నెలకొనియున్న అభిలాష తొందరలో నిస్సందేహముగా నెరవేరగలదు (112). అంతర్యామిని, ఈశ్వరుడను అగు నేను నీ కంఠమునందు ఉండి ఇతిహాసపురాణములను నీవు చక్కగా రచించునట్లు చేసెదను (113). నీవు చేసిన ఈ పవిత్రస్తుతికి అభిలాషాష్టకమని పేరు. దానిని శివాలయములో సంవత్సరకాలము ప్రతిదినము మూడు సంధ్యలయందు పఠించినచో, కోరికలు నెరవేరును (114). ఈ స్తోత్రమును పఠించు మానవులకు విద్యాబుద్ధులు వర్ధిల్లి సర్వసంపదలు కలిగి ధర్మమోక్షములు లభించునని చెప్పబడినది (115). ఉదయమే లేచి చక్కగా స్నానమును చేసి శంకరుని

లింగరూపమునర్చించి సంవత్సరకాలము ఈ స్తోత్రమును పఠించు మానవుడు మూర్ఖుడైననూ బృహస్పతి యగును (116) స్త్రీ గాని, పురుషుడు గాని సంవత్సర కాలము లింగసన్నిధిలో నియమపూర్వకముగా ఈ స్తోత్రమును జపించినచో విద్యాబుద్ధులు వర్ధిల్లును (117). బాలరూపధారియగు ఆ మహాదేవుడు ఇట్లు పలికి లింగములో లీనమయ్యెను. వ్యాసుడు కూడ శివుని యందలి ప్రేమతో నిండిన హృదయము గలవాడై కన్నుల వెంబడి నీరు గార్చెను (118). వ్యాసుడు ఈ విధముగా మహేశ్వరుడగు మధ్యమేశ్వరుని నుండి వరమును పొంది పదునెనిమిది పురాణములను అనాయాసమగా రచించెను (119). బ్రహ్మ పద్మ విష్ణు, శివ, భాగవత, భవిష్య నారద, మార్కండేయ, అగ్ని, బ్రహ్మవై వర్త, లంగ, వరాహ, వామన, కూర్మ, మత్స్య, గరుడ, స్కాంద, బ్రహ్మాండములు అనునవి పురాణముల పేర్లు. శంకరుని కీర్తిని వినే మానవులకు కీర్తి మరియు పుణ్యము లభించును (120-122).

సూత ఉవాచ|

అష్టాదశపురాణానాం పూర్వం నామోదితం త్వయా ! కురు నిర్వచనం తేషా మిదానీం వేదవిత్తమ || 123

సూతుడిట్లు పలికెను

వేదవేత్తలలో శ్రేష్ఠుడవైన ఓ వ్యాసా! పూర్వము నీవు పదునెనిమిది పురాణముల పేర్లను చెప్పియుంటివి. కాని వాటి నిర్వచనమును చెప్పలేదు. ఇపుడు వాటి నిర్వచనమును చెప్పుము (123).

వ్యాస ఉవాచ|

అయమేవ కృతః ప్రశ్నస్తండినా బ్రహ్మయోనినా | నందికేశ్వరముద్ధిశ్య స యదాహ బ్రవీమి తత్ || 124

బ్రహ్మపుత్రుడగు తండ్రి నందికేశ్వరుని ఉద్దేశించి ఇదే ప్రశ్నను వేసెను. అయన చెప్పిన ప్రతి వచనమును చెప్పుచున్నాను (124).

నందికేశ్వర ఉవాచ |

యత్ర వక్తా స్వయం తండే బ్రహ్మ సాక్షాచ్చతుర్ముఖః |
తస్మాద్ర్బాహ్మం సమాఖ్యాతం పురాణం ప్రథమం మునే || 125

పద్మకల్పస్య మహాత్మ్యం తత్ర యస్యాముదాహృతమ్ |
తస్మాత్పాద్మం సమాఖ్యాతం పురాణం చ ద్వితీయకమ్ || 126

పరాశరకృతం యుత్తు పురాణం విష్ణుబోధకమ్ | తదేవ వ్యాసకథితం
పుత్రపిత్రో రభేదతః || 127

యత్ర పూర్వోత్తరే ఖండే శివస్య చరితం బహు | శైవమేతత్పురాణం
హి పురాణజ్ఞా వదంతి చ || 128

భగవత్యాశ్చ దుర్గాయాశ్చరితం యత్ర విద్యతే | తత్తు భాగవతం
ప్రోక్తం నను దేవ పురాణకమ్ || 129

నారదోక్తం పురాణం తు నారదీయం ప్రచక్షతే | యత్ర వక్తా%భవత్తండే
మార్కండేయో మహామునిః || 130

మార్కండేయపురాణం హి తదాఖ్యాతం చ సప్తమమ్ |
అగ్నియోగాత్తదాగ్నేయం భవిష్యోక్తేర్భవిష్యకమ్ || 131

వివర్తనాద్ర్బహ్మణస్తు బ్రహ్మవైవర్తముచ్యతే | లింగస్య
చరితోక్తత్వాత్పురాణం లింగముచ్యతే || 132

వరాహస్య చ వారాహం పురాణం ద్వాదశం మునే | యత్ర
స్కందస్స్వయం శ్రోతా వక్తా సాక్షాన్మహేశ్వరః || 133

తత్తు స్కాందం సమాఖ్యాతం వామనస్య తు వామనమ్ | కౌర్మం
కూర్మస్య చరితం మాత్స్యం మత్స్యేన కీర్తితమ్ || 134

గరుడస్తు స్వయం వక్తా యత్తద్గారుడ సంజ్ఞకమ్ | బ్రహ్మండ చరితోక్త
త్వాద్ర్బహ్మండం పరికీర్తితమ్ || 135

నందికేశ్వరుడు ఇట్లు పలికెను -

ఓ తండ్రీ మునీ! బ్రహ్మపురాణము మొదటిది. నాల్గుమోముల బ్రహ్మ స్వయముగా చెప్పుటచే. దానికి ఆ పేరు వచ్చినది (125). పద్మపురాణము రెండవది. పద్మకల్పము యొక్క మహిమ దానియందు చెప్పబడియుండుటచే, దానికి ఆ పేరు వచ్చినది (126). పరాశరుడు రచించిన పురాణము విష్ణువును బోధించును. తండ్రికి, పుత్రునకు భేదము లేదు గనుక, విష్ణు పురాణము వ్యాసప్రోక్తముగనే పరిగణించబడుచున్నది (127). పూర్వ, ఉత్తరఖండలలో అనేక శివగాథలను చెప్పిన పురాణము శివపురాణమని పౌరాణికులు చెప్పుచున్నారు. (128). దుర్గా భగవతి యొక్క చరిత్రను బోధించు పురాణము భాగవతము. దానికి దేవీ పురాణమనియు పేరు గలదు (129). నారదుడు చెప్పిన పురాణము నారదపురాణము. ఓ తండ్రీ! మార్కండేయ మహర్షి చెప్పినది మార్కండేయ పురాణము. అది ఏడవది అగ్ని సంబంధము గలది అగ్నిపురాణము. భవిష్యత్తును గురించి చెప్పునది భవిష్యపురాణము (130,131). పరం బ్రహ్మ జగత్తునకు వివర్తోపాదానము అను విషయమును బోధించునది బ్రహ్మవైవర్తపురాణము. లింగముయొక్క చరితమును చెప్పునది లింగపురాణమనబడును (132). ఓ మునీ! వరాహావతారమును చెప్పే పురాణము వరాహపురాణము. ఇది పన్నెండవది. సాక్షాత్తుగా మహేశ్వరుడు చెప్పగా స్కందుడు స్వయముగా వినియున్న పురాణము స్కాందము. వామనుని చరితమును చెప్పునది వామనపురాణము. కూర్మావతారగాథను చెప్పునది కూర్మపురాణము. మత్స్యావతారరూపియగు భగవానుడు చెప్పినది మత్స్య పురాణము. గరుడుడు స్వయముగా చెప్పిన పురాణము గరుడ పురాణము. బ్రహ్మాండము యొక్క చరిత్రను చెప్పునది బ్రహ్మాండపురాణమని చెప్పబడినది (133-135).

సూత ఉవాచ|

అయమేవ మయా%కారి ప్రశ్నో వ్యాసాయ ధీమతే |
తతస్సర్వపురాణానాం మయా నిర్వచనం శ్రుతమ్ || 136

ఏవం వ్యాసస్సముత్పన్నస్సత్యవత్యాం పరాశరాత్ |
పురాణసంహితాశ్చక్రే మహాభారతముత్తమమ్ || 137

పరాశ##రేణ సంయోగః పునశ్శంతనునా యథా | సత్యవత్యా ఇవ
బ్రహ్మన్న సంశయితు మర్హసి || 138

సకారణ   యముత్పత్తిః కథితాశ్చర్యకారిణీ | మహతాం చరితేచ్చైవ
గుణా గ్రాహ్యా విచక్షణైః || 139

ఇదం రహస్యం పరమం యశ్శృణోతి పఠత్యపి | స సర్వపాపనిర్ముక్త
ఋషిలోకే మహీయతే || 140

ఇతి శ్రీశివమహాపురాణ    ఉమాసంహితాయాం వ్యాసోత్పత్తి వర్ణనం
నామ చతుశ్చత్వారింశో%ధ్యాయః (44).

సూతుడు ఇట్లు పలికెను -

నేను ధీశాలియగు వ్యాసుని ఉద్దేశించి ఇదే ప్రశ్నను వేసితిని. తరువాత నేను పురాణములన్నింటియొక్క నిర్వచనమును వింటిని (136). ఈ విధముగా సత్యవతి యందు పరాశరుని వలన జన్మించిన వ్యాసుడు పురాణములను. సంహితలను మరియు ఉత్తమమగు మహాభారతమును రచించెను (137). ఓ బ్రహ్మన్!సత్యవతికి పరాశరునితో సంయోగము ఉండగా, ఆమె శంతునునకు భార్య ఎట్లు అయినది? అను సందేహము నీకు వలదు (138). ఆశ్చర్యము కలిగించే ఈ వ్యాసుని జననమును కారణములతో సహా చెప్పితిని. వివేకులు మహాత్ముల చరిత్రలోని గుణములను గ్రహించవలెను (139). ఎవడైతే ఈ పరమరహస్యమును వినునో, మరియు పఠించునో, వాడు పాపములన్నింటినుండి విముక్తుడై మహర్షుల లోకములో మహిమను గాంచును (140).

శ్రీ శివమహాపురాణములోని ఉమాసంహితయందు వ్యాస జననమును వర్ణించే నలుబది నాల్గవ అధ్యాయము ముగిసినది (44).